ఇక నీ విషయమును వదలి మన సిద్ధాంతప్రకారము భారత యుద్ధ కాలమైన పిమ్మట పాలించిన రాజుల కాలవిషయము క్రీస్తుశకమువరకు తెలిపినయెడల సంగతి చక్కగా బోధపడగలదు. క్రీస్తుపూర్వము 1957 లో భారతయుద్ధము జరిగెనని లోగడ చెప్పితిమి. మగధరాజ్యకాలనలో

| | |
|---|---|
| క్రీ,పూ. చంద్రగుప్తుని పాలనారంభమునాటికి జరిగిన సంవత్సరాలు | 326 |
| మహాపద్మనవనందులు పాలించిన సంవత్సరాలు | 100 |
| తత్పూర్వము శిశునాగవంశమువారు పాలించినది | 360 |
| ,, ప్రద్యోతనవంశజులు 5 గురు | 150 |
| ,, భారత యుద్ధకాలము తర్వాత బృహద్రథవంశములో సోమాదినుండి రిపుంజయుని వరకు | 1020 |

దీనినే మరియొకవిధముగా జెప్పవచ్చును

| | | |
|---|---|---|
| పరీక్షిత్తు మొదలు మహాపద్మ వరకు | 1500 | B C. 1956 |
| మహాపద్మాధననందులు కలిసి | 69 | |

ఈ సం॥రములకు యీ విధముగా లెక్క సరిపెట్టినచో భారత యుద్ధకాలమునుండి జరిగిన పాలన సంఖ్యలు సరిపోవచ్చును. ఈ కాలము లన్నియు పురాణములలో గన్పడుచున్న హెచ్చుసంఖ్యల ననుసరించియు, లోగడ నుడివిన యుగారంభ కాలనిర్ణయమునుబట్టియు, ఆ యుగమునకు పూర్వము 37 సం॥లకు ముందు భారతయుద్ధమైనట్లు వ్రాసిన వ్యాసమహాని వ్రాతలనుబట్టియు నిర్ధారణ చేయుబడినది. గనుక పైన నుడివిన యందరి నిర్ణయములకన్నను యివి దృష్టాంతపూర్వకమైనవిగా భావింపవలెను. గణిత శాస్త్రజ్ఞు లాకాలపు పంచాంగములు గుణించి చూచి నా లెక్కలతో నాయా యుగములందలి గ్రహగతులను సరిజూచెదరుగాక! ఇంతవరకును ఒక్క ఇక్ష్వాకు వంశములోని తరముల సంఖ్యలను బట్టియే పూర్వయుగ విషయ ములను నిర్ణయించితిమి. పురాణములన్నింట గల యే యితరవంశముల యొక్క తరములును వీనికి మిక్కిలి తక్కువగానే యుండుటవల్ల నందు కొన్ని లోపించియుండినట్లు భావించవచ్చును. చంద్రవంశములోని వివిధ శాఖల యొక్కయు, ఇంద్రుల యొక్కయు, ప్రజాపతులను బ్రహ్మల

| | |
|---|---|
| తర్వాత చంద్రగుప్త మొదలు | 326 |
| యుధిష్టరుడు పాలించినది | 61 |
| | 195 |



యొక్కయు, మిధిల రాజులయొక్కయు వంశావళులు శోధించినను ఇట్లే యుండుటవల్ల వానిని హెచ్చుగా దర్శించుటలేదు.

పురాణములలోని యన్ని విషయములను సాంగోపాంగముగా నమ్ముచు, కొన్ని నమ్మక, కొన్ని నమ్ముచున్నామని యాక్షేపించువారి వాదముగూడ ఆలోచింపబడినది. మహాకవి కాళిదాసువంటివాడే దాని నొప్పు కొనెను. (1) ఇదిగాక సాధారణ ప్రకృతిసిద్ధాంతములకు విరోధముగాని ప్రతి విషయమును చారిత్రకదృష్టితో బరిశీలించియే నమ్మితిమనియు, దానికి విరుద్ధవిషయములో త్రోసివేసితిమనియు నిచట జెప్పవలసియున్నది. ఎవరేమి చెప్పినను విశ్వసించుట యెట్లు తప్పో, యెవరేమి వ్రాసినను విమర్శ లేకుండ నమ్ముట యట్టి తప్పే యగునని ప్రతి మానవునికి అంతరాత్మ బోధించును. అట్టి విమర్శ చేయజాలని బుద్ధి గలవారు అట్టి నిపుణుల మాటలను విశ్వసింపక తప్పదు. ఇక క్రీస్తుపూర్వము దాదాపు 7833 సం॥ల నుండి యున్న మన దేశపు వాస్తవిక విషయాలను పురాణాదులనుండి విమర్శచే తెలుసుకొందము.